శ్రీ

Reg. No. M. 2580 సం॥ చందా రు ౪ లు.




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు

సంపుటము ౨ | శనివారము ౨౪–౧౨–౩౨ | నెల్లూరు | సంచిక ౧౬

# దరిశి, పొదిలె తాలూకాల గ్రామోద్యోగుల కొక విజ్ఞప్తి

—o—

(పోలవరపు రామబ్రహ్మం—వకీలు)

ఈ విన్నపము జమీందారీ గ్రామోద్యోగులందరను మన్నింపవలసియున్నను, నాయున్న ప్రమాదము ముఖ్యముగా పై రెండుతాలూకాల ప్రజలకే గావున ప్రత్యేకించి పై శీర్షికయుంచవలసి వచ్చినది. స్వాభిమాన గౌరవములకు తిలోదకములిచ్చి, మన జమీందారు నయమునను భయమునను, పేదరయితుల బాధించి వోట్లుసంపాదించ వచ్చునుగదా యని జిల్లా బోర్డు సభ్యత్వమునకై మన తాలూకాల పక్షమున నభ్యర్థియై యున్నారు. రయితుబిడ్డలలో రయితుల కష్టసుఖములకై పాటుపడి పోరాడగల మగటిమి శక్తిసామర్థ్యములు కలవాడు లేడని కదా జమీందారు మనకు ప్రతినిధిగా వెడలనున్నవాడు? ఇట్టిపరిస్థితి యేర్పడుట మన కెల్లరకును తలవంపులుకాదా? రయితు కష్టసుఖముల పాటింపక, పండినను యెండినను, తిన్నను తినకున్నను, పిప్పిపిప్పియొనర్చు జమీందారు రయితులపై కనికరముచూపగలడా! ఏలుటకు రాజ్యములేదా! ఉన్న సంస్థానమును, అందలిప్రజలను సక్రమముగా పరిపాలించుటకు చేతగాని వారికి, స్థానికసంస్థలలో పెద్దలమని యెట్లు తిరుగనేర్తురీ జమీందారులు? ఇంతకును కాలమై పరీక్ష్యము కొంతవరకును ధనాశచే నిరుపేదలగు పాలకజనము తమహక్కులను గుర్తింపక చేతులార ఆత్మవినాశమును గొనితెచ్చుకొనుచున్నారు. నిజముగ తన ప్రజలు తన్ను ప్రేమించి గౌరవించుచున్నారని జమీందారు తలచుచున్నాడా? వారి గౌరవాదరముల వడయుటకు వీరు చేసినట్టిన కార్యము లెవ్వి—? జమీందారీయుద్యోగులగతియు నీచాతినీచముగనున్నదిగాని, తగుగౌరవమును జమీందారు వలనగాని, అన్యులవలనగాని, పొందుటలేదు.

ఈ యెన్నికలలో నైనను ప్రజలయందు స్వాభిమానము పెంపొందునని ఆశించి, యీ విన్నపమొనర్చుచున్నాను. జమీందారునకు వోటిచ్చుట యనిన ఆత్మద్రోహమే యగును. వారు మన మొరాలకింపరు. మన మేలుగోరువారెన్నటికినికారు. వారి వాగ్దానములకు మాటలకు విలువ లేదు.

ఈయెన్నికలలో జమీందారు ప్రజాప్రతినిధివని నిలచుటకు ధనబలమును, గ్రామోద్యోగుల యండయు జూచుకొనియే కదా! ప్రజలు తమబాధ్యతల గుర్తించినచో జమీందారుని ధనబలమును తృణీకరించగలరు. ఇక గ్రామోద్యోగులు తమతమ గ్రామములలో దమకుగల పలుకుబడిని దుర్వ్యయ మొనర్చక, ప్రజలయు తమ యొక్కయు పురోభివృద్ధిని మనసునందుంచుకొని, అక్రమములకు కేయూతనొసగకుందురుగాక యని ప్రార్థించుచున్నాను. అట్లొనర్చినచో, తాత్కాలిక లాభ నష్టములమాట యెట్లుండ, ప్రజలవిశ్వాసమును గోల్పోవుటయు, పేరు ప్రతిష్ఠలు మంటగలయుటయు, దటస్థించును. ఇంతకును తమరు యీ యల్లకల్లోలములలో జోక్యము గల్పించుకొన నవసరమే లేదు. కసపక్షమున ప్రజల పీడించి వోట్లుసంపాదింపుడని నిర్బంధించుటకు జమీందారున కట్టిహక్కునులేదు. ఈక్లిష్ట సమయమున మీపై ప్రజలకుగల విశ్వాసగౌరవముల నిల్పుకొనుడనియే వినయ పూర్వకముగా ప్రార్థించుచున్నాను.

---

కళాప్రపూర్ణ

## వేదము వేంకటరాయశాస్త్రిగారి స్మరణము.

———:o:———

దువ్వూరి రామిరెడ్డిగారు.

ఉ. తియ్యని దిక్కయార్య తరి తీపులతేనెలంగు కవిత్వ పారపుల్
ధారల నాంధ్ర సాహితి మధామధురం బొనరించె; నట్టి యా
కీర్తి హాల్లతోక పలికించెను పింహాపురంబు నేటికిన్
శారద కాంచికా కలిత సన్మణి కింకిణి నిక్వణంబులన్.

ఉ. నాటిని నేటనిం గలుప నాణెపు వంతెనయౌచు శాండిలీ
పాటవమందు విద్యదభికంద్య కవిత్వ విమర్శనంబులన్
సాటియుఁబోటిలేని కవిచంద్రుఁడు వేంకటరాయశాస్త్రి యా
మేటి సంస్కృతి ప్రతిమ మించు హ్యాదంతర పద్మపీఠికన్

సీ. శ్రీనాథకవివర్య శేముషీవిభవంబు
కావ్యార్థ కల్పనా గౌరవంబు
కృష్ణరాయ నృపేంద్ర కృత విష్ణుచిత్తీయ
కేరళ ఘన నారికేళరుచులు,
ప్రకృతి సౌందర్యంబు ప్రతి పదంబున నింపు
కాళిదాస కవీశు కావ్యరసము
భవభూతి సాహిత్య భాండార పేటిక
దాఁగిన యాణి ముత్యాలసరులు,
శ్రీమలకోరిచి యేరిచి సంతరించి
యాంధ్ర వాఙ్మయ దర్శన హర్మ్యమందు
సంతరిట్టిన వ్యాఖ్యాన్వ చక్రిశక్తి
చేయ స్వర్ణాతురంబులు వెలుఁగుచుండె!

సీ. సృజయించినాఁడు వివేచించి నాకలి
పేరయ్యఁ బొట్టలు ప్రియులనవ్వ;
చిత్రించినాఁడు కృతించిన యాంధ్ర శా
ర్యములేఁగ బొబ్బిలి యాహవంబు;
పరిగించినాఁడు మా భావన బాణపు
త్రిక వెండ్లి చలువపందిండ్ల నీడ;
దక్కించినాఁడు కథాసరిత్సాగర
కథలఁ దెల్గున గద్య గౌరవంబు
అంధ్ర భాషాభిమాని సమాదరించి
దిద్ది యభినయాభిరుచులు దీర్చినాఁడు
యంతట్టి కళాప్రపూర్ణున కంకితముగ
స్మరణ చిహ్నంబు నిల్పుట సార్థకంబు!

ఉ. నాఁడును నేఁడనాక యొకనాఁడును వీసరపోక జీవితం
బూడిపదాక సంస్కృత రసోజ్వల భారతిసేవ సల్పి యా
యూడిగపుం శ్రీమల్ సయిచి, యొప్పిదమైన ఫలంబు మాకుఁ జే
కూడ ననుగ్రహించిన యతుంతకృపామతివీవు ధీమణీ!

తే-గీ. ఈవొనర్చిన సేవకు నీడుజోడు
ప్రతికృతి యొనర్పలేము విద్వద్వరేణ్య
యెవరి యుపకృతియును లేక యీ యనంత
కాలమున నీదునామ మతురత గాంచు.!

## నారదవార్తలు.

———

తూర్పుగోదవరిజిల్లా ఎన్నికలనంతరము.

పిఠాపురం మహారాజావారి పట్టణమగు పిఠాపురమునకు, చక్రవర్తుల పద్మరాజు (అక్కంగు) మునసబు. యీయన ఏడు సంవత్సరములనుండి పనిచేయుచున్నాడు. యీతడు మహారాజావారి భావమరిదికి, కానేదారుకు పోటీగా తాలూకాబోర్డు, జిల్లాబోర్డు స్థానములకు నిలచినాడన్న కారణముచేత, యీనియనుబోర్డు అధ్యక్షుపదవి ఊడబెరికించి, కోపము చల్లారక మునసబు పదవి తీసివేసినారట. ఇంకనుఅవమానపరచుటకు, గ్రామవెట్టియూరుకు జీతమివ్వకుండ అపహరించి నాడని, పెద్దాపురం డిప్యూటీ కలక్టరువద్ద క్రిమినల్ కేసు పెట్టి సాగిస్తున్నారట. పద్మరాజును శిక్షించి, జయిలుకుపంపితే పైవార్ల మనస్సు శాంతించునేమో?

డిశెంబరు 22-వ తేదిని జిల్లాబోర్డు అధ్యక్ష యెన్నిక జరిగిన జమీందారీ జస్టిసుపక్షము ఓడిపోయి, పల్లంరాజుగారు గెలుతురను భయముచేత, ప్రధానమంత్రి బొబ్బిలిరాజాగారితో చామర్లకోట స్టేషనులో, వాల్తేరునుండి 6-వ తేదిని, మహారాజావారి శలవుప్రకారం పిఠాపురం దివానుగారు తేదీ మార్పించమని వేడుకొన్నారట. ప్రధానమంత్రిగారు మహారాజావారి వార్తకు అభయ హస్తమిచ్చి, తేది మార్చినారు; అయితే మహారాజావారి జ్యేష్ఠకుమారులు మాడర్న్ రివ్యూలో వ్రాసిన "జమీందార్లు-వారిభావిదశ,, కున్ను,యీయెన్నికలలో చేయుచున్న ప్రయత్నములకు యేమయినా సంబంధమున్నదా? మాటలొకటి. చేతలింకొకటి.

## మా కేమైనా రోడ్డేసినావా?

———

జమీందారు జిల్లాబోర్డు ప్రెసిడెంటైతే జమీందారీ గ్రామాలన్నీ రోడ్లమయమై పోతవని నెల్లూరు వారను కొన్నారు. ఇదికల్లోది నాటకమని వారికేమి తెలుసు? గూడూరు వెంకటగిరి రోడ్డులో, గొల్లపల్లెనుండి జయంపు రైలుస్టేషను వరకు ప్రాంచిరోడ్డు వేయబడియున్నది. ఇట్లే నెల్లూరు మద్రాసు రోడ్డులో నుండి వెదపరియ రైల్వేస్టేషనుకు ఒకబ్రాంచి రోడ్డు వేయబడి యున్నది. వీటికి రెంటికి మధ్య 9 మైళ్ళు రోడ్డు వేసినచో వెంకటగిరి రోడ్డులోనుండి జయంపు, వెదపరియ రైల్వేస్టేషనుల మీదుగా ట్రంకురోడ్డులో కలుసుకొనుటకు వీలేర్పడును. జయంపు, అరిమానిపాడు, చిల్లమానిచేను, మొదలగు గ్రామాదులకు యిది చాలా అవసరము. లోగడయిది ప్రసక్తి వచ్చి ఆగిపోయినది.

———

సింహపురి నాట్యమండలి వారి

## సక్కుబాయి నాటక ప్రదర్శనము.

మొన్న సింహపురి నాట్యమండలి వారు సూళ్ళూరుపేట నాటక శాలలో తమ సక్కుబాయినాటకమును కడుంగడు రమ్యముగ ప్రదర్శించి సభ్యులకు ముదము నొసగూర్చిరి. నాటకము ప్రారంభమునుండియే రక్తికట్టి, చేయబడిన ఔచితీపూర్ణమైన మార్పులతో చక్కగనుండినది.

ఇంతవరకు ప్రదర్శింపబడిన సక్కుబాయికంటె కొన్నిరసవత్తరమైన మార్పులు చేయబడి ఇది అభిరుచి మనమునై యుండినది. చేసినమార్పులకు నటకుల అభినందించ వలసియున్నది.

సక్కుబాయి పాత్రధరించిన మిండుతూరు బాలకృష్ణమూర్తిగారు హాయినింపే సంగీతముతో, భక్తితన్మయతలగూర్చు అభినయముతో నెరవేర్చినారు. విశ్వనాభట్టు అమాయకత్వమును, భార్య ప్రేమ మాతృభక్తుల మధ్య అనుభవించినబాధలను ఎండ్లూరు గోవిందసింగుగారు కనికరముగలుగునట్లు, నవ్వుబుట్టునట్లు నటించిరి. అత్తపాత్రధారి బాలకవి, వేమూరుసుందరరామశర్మగారు నాటినటకులలో మేటియై, విసుగుబుట్టించని గయ్యాళితనముతోను, ఆశ్చర్యమును గొలుపు చలాకీయైన అభినయముతోను నాటకరక్తికి తోడ్పడి మెప్పునొందిరి. శివయోగి వేసినకృష్ణమూర్తిగారు తనమ్యును మధుర గానముతో హాయినిగూర్చిరి. ఇతరస్త్రీపాత్రధారులెల్ల తమపాత్రల యేవెలితి లేకుండ జేసిరి.

నటకులందరు బాలురయ్యు, పెద్ద లోపములేవియు లేకుండ జేయుట మెచ్చదగియున్నది. వీరినందరి దిద్దిన శ్రీ పల్లాప్రోలు రంగాచార్యులుగారు ప్రశంసాపాత్రులు.

ఈమధ్య 4పండ్ల యువతల మననెల్లూరువారి ప్రయత్నములు ఏదిగాని యింతఫలవంతముగా నుండలేదనుట ఎన్నదగియున్నది.

సూళ్ళూరుపేట పురవాసి.

## వేంకటరాయ శాస్త్రిగారి వర్ధంతి.

కళాప్రపూర్ణ వేంకటరాయశాస్త్రిగారి వర్ధంతి చాల జయప్రదంగా జరిగిపోయింది. వారు ఆంధ్రభారతికి చేసిన పూజికము మూలకంగా నెల్లూరికి చేకూరిన కీర్తిఋణం మండలీయులు యిస్లీ తీర్చుకోవలసి ఉంటుంది.

ఈ సందర్భంలో శాస్త్రిగారి పేర, ఒక సంస్కృత గ్రంధాలయాన్ని నెలకొల్పుట చాల ప్రశంసింపదగి ఉన్నది.

నాటకకళను ఉద్ధరించి, ఆంధ్ర నెల్లూరును నాయకమణిగా చేసిన శాస్త్రుల వారి పేర నాటక పోటీలను జరిపి, నెల్లూరువారి నాట్య మాంద్యాన్ని కొంతవరకు పోగొట్టినారు. బహూకరణ ప్రదానం సమంజసముగానే ఉండింది.

నాడు శ్రీవారి కీర్తి కల్పింపబడిన పద్య నీరాజనములలో శ్రీనువ్వూరు రామిరెడ్డిగారివి కళాప్రపూర్ణముగ నుండినవి.

మాటలోమాట-శాస్త్రులవారి పుణ్యానయిప్పటిదిగాక పోయినా, పూర్వజన్మ సుకృతం వల్ల ప్రతిపుస్తకంలో ఎక్కిన యీనాటిరెడ్డిగారు, తమ నిసర్గస్వభావం చేత గాబోలు నాడుగూడ అవకతవకలు తప్పింపలేరి. తన పద్యాలు చప్పిడి చొప్పదంట్లు అయినందునను, పుస్తకముఖపత్రమువలె ఫలానివారు వ్రాశారు, ఫలానిచోట అచ్చుఅయింది అన్నమాదిరి వుండటంవల్లను చదువుటలో స్వారస్యం లేకపోయినా, రామిరెడ్డిగారి పద్యాలను చదివి పాపం! వాటిని మర్దన చేసినారు. ఇకతన పద్యాలలో "ఆమరణాంతమని" అపశబ్దాలకు వెనుకదీయకుండా వ్రాసినారు. ఆజన్మము సాహిత్య మహోదధి తీరాన చలువపందిలో విశ్రమించిన యీ రెడ్డి పండితప్రకాండులకు వ్రాయక వ్రాయక ఒకటివ్రాసినా శుద్ధంగా పడేటట్టులేదు. ఈ వృద్ధులనిద్దుష్టంగా ఒకటైనా వ్రాసి కట్టైరయితే బాగుంటుందేమో!

"జంకుగొంకులేని" విమర్శకుడు.

## ఎస్టేటుద్యోగుల మార్పులు

వెంకటగిరి యెస్టేటు ఉత్తరఖండందివాన్ పేష్కారుగారగు రామస్వామయ్యరుగారిని దక్షిణఖండమునకు మార్చి దక్షిణ ఖండంపేష్కారుగారగు నారయ్యగారు పోలూరు డివిజన్‌లో రయితులకుయెస్టేటుపై కాస్త్రైతా కూడపుట్టించినందుకై వీరిని నాల్గవరాజకుమారుని క్రొత్తరాజ్యమునకు కోలంకకు దివానుగానుంపదురనియు, ఉత్తర ఖండమునకు విద్యాధికుడును, న్యాయవర్తనుడునగు శీతాపతిరావు గారిని దివాను పేష్కారుగా నియమింతురనియు తెలియుచున్నది. నారయ్యగారు దక్షిణ ఖండమునుండి వదలినతోడ్బో పోలూరు డివిజను రయితులు హర్షాతిరేకముగా పరిగణించి, ఉత్సవములు, సభలు, చేయదలచియు వసంతిగా నున్నది.

## రంగనాయకులగారి సంచారము

ఆచార్య రంగనాయకులుగారు, నెల్లూరు వెంకటాద్రిహానాయుడుగారున్నూ 18 తేదీనుండి వెంకటగిరితాలూకాలోనుండు చిన్నపరెడ్డిపల్లె, యూతలూరు, అత్తివరము, యాచవరము, పెరిమిడి, మేంకూరు, భీమవరము గ్రామములలో సంచారమొనర్చి లోకలుబోర్డులలో రైతుప్రతినిధుల నెన్నుకొనవలసిన అవసరములను గూర్చియు, అస్పృశ్యతా నివారణమునుగూర్చియు రైతులకు ప్రబోధించెదరు. 23 తేదినుండి పొదిలి, దర్శి తాలూకాలలో సంచారమొనర్తురు.

## కో ఆపరేటివ్ బ్యాంకు డైరెక్టర్లు.

17-12-1932 తేదీ జరిగిన నెల్లూరుజిల్లా కో ఆపరేటివు బ్యాంకు డైరెక్టర్ల ఎన్నికలలో శ్రీయుత రేబాల లక్ష్మీనరసారెడ్డి, బెజవాడగోపాలరెడ్డి, కే. వి. రాఘవాచార్యులు, యం. యస్. నరసింహారావు, వావిలేటి విశ్వనాథరావు, రేబాల దశరథరామిరెడ్డిగార్లు జయమొందిరి.




# జమీందారులు—రయితులు ఎన్నికలు

—o—

రంగనాయకులుగారు.

## I

శాసనసభ యందు, జమీందారులు, రయితుల కండ్లకు గంతలుగట్టి, రయితులపేరున, తామె, సాధ్యమయినన్ని స్థానముల నాక్రమించుచున్నారుగదా! విశాఖపట్టణం, గంజాం, తూర్పుగోదావరి జిల్లాల తరపున, ప్రస్తుతము శాసనసభ యందున్న అధికసంఖ్యాకులగు సభ్యులు జమీందారులుగాగాని, వారిరాచకీయ మిత్రులుగాగాని, వారిసహాయముచే జయమందినవారుగాని యున్నారు. కనుకనే, ఎస్టేటులాండు ఆక్టుయొక్క సవరణబిల్లును, రయితుసంఘమువారు, శాసనసభయందు ప్రవేశపెట్టించ దలచగా, గుంటూరుజిల్లా ప్రతినిధియగు శ్రీ చెలసాని సత్యనారాయణగారొక్కరు మాత్రము దొరకిరి. తుదకు వారును పబ్లికు ప్రాసిక్యూటరు పదవికై, శాసనసభా సభ్యత్వమునకు రాజీనామాపెట్ట, మన సవరణబిల్లు మట్టిలోగలసిపోయెను. తుదకు, ప్రభుత్వముచే ప్రవేశపెట్టబడిన, సవరణబిల్లైనను చర్చింపబడునప్పుడుగాని, సెలెక్టు కమిటీయందు విచారింపబడునప్పుడుగాని, మనవారు అని పిలువదగిన ప్రతినిధులే ఆరుజల్లాలకుగాను, రయితులకు శాసనసభయందు లేరయిరి. ఇప్పుడు బొబ్బిలిరాజాగారి మంత్రిత్వదశయావిర్భవించిన ఫలితమాయన్నట్లు, ప్రభుత్వపు సవరణ బిల్లైనను, తిరిగి చర్యకు తేబడదట!

ఇట్టిదురవస్థకంతకు కారణము, రైతులయొక్క స్వయంకృతాపరాధమే! కాని యెడల, ఇప్పటి ఓటర్లయందధిక సంఖ్యాకులీ జల్లాలయందు రయితుజనమేయైయుండ, జమీందారీ పార్టీయింత ప్రాముఖ్యము నందుండుటకు కారణమేమి? జనసామాన్యమునకుండినవోట్లు, వారిమంచిచెడ్డలనారయని, వారికష్టసుఖముల తెలియని, వారిసౌకర్య సంపాద్యమార్గముల కనిపెట్టని జమీందారీ పక్షీయుల కొల్లివ్వబడినవి? రయితును క్షీణింపజేయుటయందే పేరొందుచున్న జమీందారులు, రయితునకు, కాలానుగుణముగ, ప్రభుత్వము కల్గించుసౌకర్యములనయినకల్గింపనిచ్ఛగింపని జమీందారులు, రయితు బాగుపడుటకు కినియునట్టియు, రయితు తనసంఘమును బలపరచుకొనుటజూచి కంటగించుకొనునట్టి జమీందారులు, ఇవ్విధముగా, దమమిత్రులు, పక్షీయులతోబాటు శాసనసభలకు పోగల్గుచున్నారన్న, రయితులు అందును, జమీందారీ రయితులు, తనువశమయియున్న వోటుహక్కును తమజాతికసదాప్రబల విరోధులయినవారికిచ్చుచున్నారన్నమాట! తమజీవితమును వంచించుటలోనే, స్వప్రతిభకలదను కొనువారికి, రయితులిప్పటివరకు వోటులిచ్చి వంచకులయిరి. ఇకనయినట్టి స్వవినాశన కరమగు పద్ధతి మానుట, రోయుట రయితులధర్మము.

## II

స్థానిక సంస్థలలో అనేకము జమీందారుల వశమగుచున్నవి. నెల్లూరు కృష్ణా, విశాఖపట్నం, గంజాం జిల్లాబోర్డులు, జమీందారుల హస్తగతమైనవి. అనేక తాలూకాబోర్డులు వారి పెత్తనము క్రిందనే యున్నవి. రయితు లెల్లరు చెల్లించు పన్ను ధనమే, తాలూకా, జిల్లాబోర్డులయొక్క ఆదాయమగుచున్నది. ఈ బోర్డులు, రయితుల ధనముతో, రయితాంగమునకు, గ్రామ్య వాసులకు నలయు సుకార్యముల నెరవేర్చ, అవసరముల దీర్చుటకు యేర్పరచబడినవి. ఒకప్పుడి బోర్డులు, కలెక్టరులు, సబుకలెక్టరుల పాలనము క్రిందనున్నను, ఇప్పటికి పన్నెండు వత్సరములనుండి, పూర్తిగా ప్రజా పాలన క్రింద శాసన పూర్వకముగా, పెట్టబడినవి. ఏ రయితు లీ బోర్డుల యాదాయమునకు ఆధారులో, ఏ రయితుల యవసరముల దీర్చుటకై యీ బోర్డులు స్థాపించబడినవో అట్టి బోర్డులు యీ దినములందు, జమీందారుల హస్తగత మగుట వింతయే కాక విపరీతము కూడనైయున్నది.

తాలూకా జిల్లాబోర్డులు రయితులకగత్యమగు స్థానిక ప్రభుత్వ విద్యుల నిర్వర్తింప వలసియున్నవి తాలూకాబోర్డులు, గ్రామ గ్రామముల మధ్య రహదారుల నేర్పరచి, వివిధ గ్రామముల దాపునగల పెద్ద రోడ్లకు కల్పుట కగత్యమగు రహదారుల నేర్పరచ వలసియున్నది; మరియు గ్రామ గ్రామమునకు ప్రాథమిక విద్యాలయముల నేర్పరచవలయును; ప్రజలకు కల్గు వివిధ వ్యాధులకు తగిన చికిత్సలను సకాలమున చేయించుటకు ఆస్పత్రుల స్థాపించవలెను; దీనులకు,హరిజనులకు, తదితర ప్రజలకు అగత్యమైన ప్రదేశములందే లైడల, మంచినీటి వసతులై, తటాకములను లేక, బావులు త్రవించవలయును. ఇక జల్లాబోర్డులు, గొప్ప రహదారుల నేర్పరచి, ఉన్నత విద్యాలయముల స్థాపించి ప్రబల యారోగ్యాభివృద్ధికై వలయుప్రయత్నముల జేసి, ఏరుల పైన, నదు

లపైన గొప్ప వంతెనల నిర్మించి, రయితుల కనీసత్యమగు వసతుల కల్గించవలసియున్నది. ఈ విధుల నిర్వర్తింప వలసిన బోర్డులపై రయితుల జీవితవిధానము నెరుంగని, రయితుల కష్టసౌఖ్యముల తెలియక, రయితాంగపుటవసరముల కన్గొనని జమీందారులకు, వోటరులగు రయితులు, బోర్డులపై పెత్తనము కట్టిపెట్టుట విపరీతమేకాక, స్వజాతి వినాశనకరమగుచున్నది. రయితు కార్యముల నిర్వర్తింప వలసిన బోర్డులపై రయితు నాయకులకే పెత్తనమిచ్చుట వలన బోర్డులు స్వకార్యనిర్వహణమునందు ప్రమత్తులగుట సాధ్యముకానచ్చును.

III

తాలూకా, జిల్లా బోర్డులు, జమీందారుల వశమగుచో, ఆ జమీందారులను వారి అనుయాయులను తమ స్థానిక ప్రభుత్వ కార్యములు సక్రమముగా నడుపబడుచున్నవా లేదాయని ప్రశ్నించుటకు రయితులకు సులభ సాధ్యముకాదు. ఎప్పుడైనగాని ఏ తాలూకాబోర్డు మెంబరుగాని, లేక ప్రెసిడెంటుగాని, తన ధర్మము నిర్వర్తించక ప్రజలయవసరముల గమనించక, రయితులకు సౌకర్యముల గూర్పక, స్వలాభాపరుడై యున్నగాని, లేక, అజాగ్రత్తత జూపినగాని, అట్టి సభ్యునిగాని, అధ్యక్షునిగాని రయితులు తగురీతి మందలింపజాలరు! వీరి జూచి తామందరు భయమంచుందురో, ఎవ్వరికోపతాపముల వలన తామనేక బాధలకు లోనగుదురో వీరికృపా కటాక్షముల సంపాదించుటకై తామందరు సదా ప్రయత్న పడుచుండవలెనో, అట్టి జమీందారులనె గనుక, తాలూకా, జిల్లాబోర్డులపై పెత్తనదారులుగా చేసినచో వారిపై రయితుల కేకేటి పెత్తనము లభించగలదు! అట్టి జమీందారులను, తమ యాజ్ఞాబద్ధుల జేసుకొను శక్తి సామర్థ్యము రయితులకు కలుగదు. ఎవ్వరు తాలూకా, జిల్లాబోర్డు సభ్యులు అధ్యక్షులపై, అధిపత్యము వహించి, వారి పదుపుటాజ్ఞలందుంచవలెనో, అట్టి రయితులు జమీందారుల అడుగులకు మడుగులొత్తవలసి యున్నంత కాలము జమీందారుల కనుసన్నలపై మెలగుచుండునంత కాలము. జమీందారున వస్తువాహన విజృంభణతజూచి, వారి పటాటోపములు, ధనధాన్య సంపదల గాంచి భ్రమజెందునంత కాలము తగురీతి స్వధర్మమును నిర్వహింపజాలరు! ఏయేబోర్డులు జమీందారులకు వశంగతమై యున్నవో, అచ్చటిల్లనా బోర్డుపరిపాలకులను, మంచిచెడ్డల నడగుటకు గూడ రయితులకు అవకాశము కల్గుటలేదు. అట్టి జమీందారీ పెత్తందారుల యోగ్యతాయోగ్యతల విచారించు సావకాశము రయితులకు కల్గుటలేదు. వెంకటగిరి తాలూకాబోర్డు వెంకటగిరి రాజాగారుల పెత్తనము క్రింద, పది వత్సరములనుండి యున్నను, రయితుల ధనము, లక్ష యిరువదివేలకు మించి వారు, బోర్డు పేరిడి ఖర్చినను, తామెన్ని రోడ్లను, వంతెనలను, పాఠశాలలను, ఆస్పత్రుల స్థాపించిరో యింతవరకు చెప్పవలచ లేదన్న, జమీందారులకు, వోటరులన్నను, రయితులన్నను, ఎంతచులకనగా జూచుచున్నారో తెలియుచున్నది. అటులనే, కాళహస్తి తాలూకాబోర్డు, నెల్లూరు, కృష్ణా జిల్లాబోర్డులపై పెత్తనము సంపాదించుకొనిన జమీందారులు, తాము రయితుల ధనము నెట్లెట్లు ఖర్చిడి ఏమి కార్యముల నెరవేర్చిరో చెప్పకున్నారు. కారణము? జమీందారులకు రయితుల యెడభయము లేకుండుట! వారికి రయితుల జూచిన లెక్క లేకుండుటయేకదా! వీరు తమ సేవకులై యుండదగునో వారు తమ్ము మించిన వారై యుండ, వీరు తమ తరపున తమవల్ల పెత్తనము బొందుచున్నారో వారు తమపైనెక్కి తాండవ మాడుచుండ అట్టి జమీందారుల, ప్రజాపక్ష విముఖుల ప్రజాస్వత్వ విధ్వంసకుల రాజాధిరాజులమని ప్రకటించుకొను ప్రజాస్వామిక విరోధులను రయితు లెన్నుకొనుట పొరపాటుకాక స్వజాతి వినాశన కరమేకాక స్వరాజ్య విచ్ఛిన్న దాయకమగుచున్నది. రయితుల ధనముపై రయితుల బోర్డులందు రయితు యవసరముల దీర్చుటకుగాను రయితు పెద్దలనే రయితులెన్నుకొనుట భావ్యము. పైగా రయితులవిధి కృత్యమై యున్నది.

---

## విధుర విలాపము.

:o:

వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు.

కస్తూరిదేవి విద్యాలయము.

తే. చిగురుజొంపంపు వ్రేగునఁ జెలువుగాంచి
ప్రబలమౌ జెడి క్రొమ్మావి లతికపయ్యె!
గండుగోయిల దుఃఖాశ్రు కలికిలోదల
కాలహతకుండు ప్రకృతిలోఁ గలిపివైచె.

తే. చాలగాఁ జూచి కనువారు సంతసింప
దిశల నామోదదీపముల్ దేజరిల్ల
వరలు విరజాజి క్రొన్ననవాసిదూల
దుష్టపవనుండు మలినెట్టి త్రుంచివైచె.

తే. రేయిబవలును జింతచే గృశతనొంది
కారుకన్నీరు వెల్లువై గట్లనొరయ
క్షణము యుగముగ గనుపట్టఁ జావనంగఁ
బెండ్లియట్టుల దలపించుఁ బ్రేమచేత.

తే. అవిరతాశ్రు జాలంబు లాపరాక
వెల్లువైపార మదిలోని ప్రేమసస్య
మావరించెను రోమాంచమనెడి మిషను
నీకు నాత్మప్రశాంతమై నెమ్మిగ్రాల.

తే. సుభగ మాలతీసంజాత సుమము లట్ల
నీదుగుణములు విలసిల్లు నిర్మలాంగి,
స్మృతికివచ్చిన నయ్యవే హతముసేయు
నన్ను విశ్రాంతి గనని విపన్నుమగ్ను.

తే. ప్రేమఁ బాదొట్టిలోనిడి పెంచుకొన్న
బుడుతపన్నీరు మొక్కన బూలునిండ
విధివశంబున మాయించె వేరుపురుగు
సాకికొన్నట్టి వారలు శోకమంద.

తే. మలయమారుత శ్వాసముల్మలయుచుండ
అమలమందాకినీ శైత్యమావరింప
విద్యుదమలంపు కాంతులు వెల్లివిరియ
గగనమందుండి భాసింపు శ్రమఘనిలి.

తే. నాకశ్రోతస్స్వసి జల స్నానమాడి
మహిత మందార సుమముల మాలదాల్చి
అనిమిషాంగన లెంతయు నాదరింప
ఆత్మశాంతిగ నెలయు మో! యబలమిన్న

తే. సుఖమొ కష్టమొ మోదంబొ శోకమేమొ
కట్టి దట్టిదనునరాని దేదొ యొకటి
మానసంబును వేపెడి మండనివ్వను
పుటమునందున్న యగ్గినిబోలి యెపుడు.

తే. పూలఁ జెలువారు కొమ్మపై గ్రాలుచున్న
విహగ యుగళాన జెంటని విశిఖ హతిని
వ్యాయఁజేసెను గాలమర్కబోయ యపుడె!
ఎల్లి జీవించు మగపులుగింక మీద.

తే. స్నిగ్ధమేచక శాద్వ లక్షితాలయందు
నయన కాంతులనీలముల్ నాట్యమాడ
మెలగుచుండెడి వారిణంపు మిథునమందు
నియమనివ్వ కమస్త్రెపెంటని నీటఁగలిపె.

మ. వనితామేటికి నిచ్చటచ్చట నిటుల్
పద్యాళి నర్పించుచున్
కనులన్ గాలెడి బాష్ప బిందువులచే
గల్పించి ముక్తావళిన్
దినము ల్పుచ్చఁగ లేకనిందువగచే
దీనుండనై యుండుటన్
జనుదెంతున్ గొనిపొమ్మనీ వసతికిన్ సత్యంబు
ప్రాణాధిపా.

## నూతన జిల్లాజడ్జి

నెల్లూరుజిల్లా జడ్జిగానుండిన కృష్ణస్వామిఅయ్యరుగారు ఈనెల 9-వ తేదిన ఉద్యోగము నుండివిరమించుకొని వెళ్ళిరి. వారిస్థానమున నియమింపబడిన భుజంగరావుగారు యీనెల 20-వ తేదిన నెల్లూరువచ్చి చార్జిపుచ్చుకొనిరి.

## నెల్లూరు జిల్లా జడ్జి
## శ్రీ. వి. కృష్ణస్వామయ్యగారు.

ప్రధానన్యాయమూర్తిగ నెందరు జిల్లాజడ్జీలో వచ్చుచు పోవుచునుండిరిగాని, శ్రీ కృష్ణస్వామయ్యగారికి పౌరులుగావించిన వివిధగౌరవసత్కారముల యిదివరకే యధికారియు పొందియుండలేదు. వారీపట్టణమున అడుగిడినదిమొదలు పౌరులు వారియందు జూపిన గౌరవవాత్సల్యములు వర్ణనాతీతము. అధికారమదహంకారము లేక నెట్టివానితోనైన కలసి మెలసి మెలంగుచుండి తమసర్వతోముఖ పాండిత్యమును ప్రకటించుచుండిరి. న్యాయస్థాన గౌరవము నతి కుశాగ్రబుద్ధితో నిర్వహించిరి. వీరికిప్పుడు విరామము లభించుటచే దేశసేవకు తమ అసమాన విజ్ఞానమును వినియోగించుటకు వీరికి ఆయురారోగ్యైశ్వర్యము లనొసంగ భగవంతుని ప్రార్థించుచున్నాము.

# ఆసుపత్రియేదీ?

వెంకటగిరి దొరవారు ఆయుర్వేద ఆసుపత్రిని ఆ తీవరములో పెట్టుటకు ధైర్యము తీర్మానించి, యిస్టేటువారికి విరోధుడగు ప్రత్తేతి నారాయణరెడ్డిగారికి ఆసుపత్రిలో మందు దొరకకుండా చేయవలెనని యీ ఆసుపత్రిని యిన్నటుకు 15 మైళ్ళ దూరమున అరవపాళెమున స్థాపించిరి. అరవపాళెమునకు ఒక మైలు దూరమున ఆమూరులో ఒక ఆసుపత్రి యుండగా యింత సమీపములో మరియొక ఆసుపత్రిని స్థాపించుట ఎంతటి బుద్ధి పరిపాలనో పాఠకులూహించగలరు.

ఆ తీవరములో స్థాపించియున్నచో చుట్టు ప్రక్కల 10 మైళ్ళ వరకు ప్రజలకు అనుకూలముగా యుండి యుండును. ఇంతమాత్రము ఉపకారము చేయ యిష్టములేనివారు తిరుగా ఓట్లకై ఆ దేవాళ్ళింతమున దేబిరించవలసిన జాలికము బట్టుట విచారకరము. వారికెట్లున్నను, ఓటర్లకైనను సిగ్గులేదా? అరవపాళెమునకే పోయి ఓట్లడుగక మమ్మేల బాధించుచున్నారో తెలియదు. ఏమియుపకారము జేసిరని వీరి ముఖము జూచి మేము ఓట్లనిత్తుము.

కంచెలు, రివిజనులు, డిక్రీలు ఇవేగా మమ్ముల భయపెట్టు సాధనములు. వీటికి నిడిగంటి కాశీపరెడ్డి చెప్పిన సమాధానమేగా మేమును చెప్పునది.

తమ్ము మేము ఓడించినామనే కీర్తికంటె, తామే విరమించుచున్నామని తెలిపిన గౌరవము కాదా?

"డిక్రీ బాకీలులేని రైతు"

# అడవిదొర.

వెంకటగిరి అటవీశాఖ ఉన్నతోద్యోగియగు జూపల్లి రాజగోపాలరావు గారిని వెంకటగిరి తాలూకానుండి మార్చి వేయమని రయితులు మహజర్ నామా పెట్టెదరని తెలియుచున్నది.

ఈ సోదర వర్గమువారు చేసియుండు రహస్య విషయములన్నియు రజువు పరచుటకు రహితులు సిద్ధపడియున్నట్లు గూడ తెలియుచున్నది.

వెంకటగిరి

# నాట్యకళ

—o—

ఆరిపోయిన దీపాలు మళ్ళీ వెలిగిస్తారా నాటకాలమూలాన? పాపము, పదహారు వేలరూపాయలు పాడుచేసుకొని, నాటకసారము గ్రోలితన్మయత్వము చెందుచుండే వారికొచ్చిందిప్పుడుతిప్పలు. యేదో కొంతమటుకు సక్రమంగా ఆదాయంవచ్చే వర్లమిర్షా నోట్లో మన్నుబడిందన్న మాట. యీలాంటిజోక్యం జింఖానా గ్రవుండ్సులో కలుగజేసుకొన్నా పరువు ప్రతిష్టలకు వన్నె దెచ్చిన వారైయుందురే? ఓహో! వెనుకటి మాదిరిగాదటనే ఇప్పుడు రాముహాచారిగారి పూర్తియిమిటేషన్ అటనే. నయమే. స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించాలను తర్కముసమర్థించిన వారవుతారు కే! స్త్రీ, రంగస్థలముమీద, పరపురుషుని నాథా, యనిసంబోధించి ప్రేమనటన చెయ్యవలసి వచ్చినపుడు ఆమెపాతివ్రత్యమునకు భంగముకలుగుననే వాదనలు తర్కాలు రాకమాననాయా. మాకుమాత్రము అలాంటి యిబ్బందులేమిలేవు. రక్షించారు. స్త్రీ వేషధారులు దేవదాసీలు, తక్కువపడితే దివాణందాసీలట. ఆంధ్రనాటకాలు చెప్పరాని ప్రభతో వెలిగే ఈరోజుల్లో, ఆంధ్రం సరిగాచదువను, వ్రాయనురాని స్త్రీలు వేషధారులైనప్పుడు, మాకు గూడా రానేవచ్చింది అవస్త. ఎట్లాగు స్త్రీలు వేషధారులంటే కళకు అట్లనే వన్నెవ్రాడి పడుతుందట. ఆంధ్రదేశము తదేకదృష్టితో యీనూతన నాటకసమ్మేళనమునకై యెదురుచూస్తుందట. నాటకాలలో యేదో కొంత పాటుబడ్డ స్వానుభవము చేతనాఅభిప్రాయముచెప్పాను. నామీదకోపపడకండి. మైలవరంరాజాగారు జ్ఞప్తికివస్తేగుండెజల్లు

# కుంభకోణము జరిగినది.

—o—

ఆ తీవరములో స్కూలుకొరకు ఒకయిల్లు రు 400 లకు తాలూకాబోర్డువారు కొన్నారు అది రు 20 లకు పైన చేయదు. ఆ యిల్లు మొదట పాడైనది. అదివద్ద గొట్టికాటి వెంకటస్వామిరెడ్డిగారి పేర విక్రయము చేయించి తర్వాత బోర్డువారికి విక్రయించిరి. దీనిలో జూపల్లి వెంకటాద్రి మహారావుగారి కెంతవరకు సంబంధమున్నదో, రెడ్డిగారి కెంతవరకు సంబంధమున్నదో కుమారరాజాగారు విచారింతురా?

ఇట్టి దుర్వినియోగముల కండ్లార గాంచిన రయితులను తిరుగా ఆ స్థానములకు నమ్మిపంపమని ఓట్లడుగుచున్నారు.

ఓటర్లకేమి సమాధానమిస్తురో?

"ఒక ఓటరు."

# లంచములు.

వెంకటగిరి తాలూకాలో అందరు ఉద్యోగులు తీసుకొనిన లంచముల గూర్చి జమీందారీ రయితు సంఘమువారు కొందరు గ్రామస్థులవద్ద వ్రేలిముద్రలతో సహా స్టేటుమెంటుల సేకరించియున్నారు. వాటిని త్వరలోనే ప్రకటించెదరని తెలిసి కొందరు ఉద్యోగులు వారిని కాళ్ళు పట్టుకొనుచున్నట్లు తెలియుచున్నది. కాని ఈ కథ ఎలెక్షన్ లోపలనే బైటబడునని తెలియుచున్నది.

---

మంటుంది. అయితే యిచ్చట స్త్రీలున్నారుగదా. కొంతమేలుగే. నాట్యకళయెడ మారెండోనాయనగారికెంతటి అపూర్వశ్రద్ధయేలకలిగించ దనేసందేహం మాదువదులకు రాకమానదు. నేనెట్లాగుతిర్చ్చకతప్పదు. జమీందారీస్థానములలో వ్యభిచారము యీదాసీల మూలమున మరింతవృద్ధియగు ఘోషనుమాన్పడానికి యీనాటకాలుప్రథమసోపానమట. సదుద్దేశముతో యేపని చేసినా అదిసక్రమంగా యేలకొనసాగదు? కానీండి. త్వరంగా ఆంధ్రదేశము ఉవ్విళ్ళూరుచున్నది. నేనుగూడా తదభివృద్ధికోసరం జగన్నాటక సూత్రధారుని ప్రార్థిస్తుంటా.

మల్లిశెట్టి వెంకటకృష్ణయ్య,
బెంగుళూరు

## నెల్లూరు అడిషనల్ డిస్ట్రిక్టు మునసబుకోర్టులో

---

స్మాలు. నెం. 1698 OF 1932.

వాది:- కంచర్ల పోలుగాడు.

ఎదిరి.

ప్రతివాది:- తాటిబోయిన పెంచలయ్య

యీ నెంబరువాది ప్రానోటునుబట్టి రు 53—6—8లకు తెచ్చినదావా ప్రతివాదికి నోటీసునిమిత్తమై 3-1-1933 తేదీకి వాయిదావేయబడియున్నది. సదరు తేదీన ప్రతివాది స్వయముగాగాని వకీలుద్వారాగాని హాజరుగానియెడల సదరుదావా ప్రతివాది పరోక్షమందు తీర్మానించబడును.

చివుకుల క్రిష్ణస్వామి,
వాది ప్లీడరు.

---



సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు, నెల్లూరు, వెంకటరామానాయుడు, జమీందారీరైతు ముద్రాక్షరాలయం, గాంధిచౌక్, నెల్లూరు.